మండలములోని కోవెలకుంట్లతాలూకా ఆకుమళ్లగ్రామము వాఁడని ముద్రాపకులు ముద్రించిరి. కవియాధునికుఁడు.

## మద్దాలగురుస్వామి

ఇతఁడు వ్రాసిననరసింహశతకము, లక్ష్మీనరసింహతారావళి యు నాకుఁ జిక్కినవి. ఇతఁడు గౌతమగోత్రజుఁడని మాత్రము శత కాంతమునఁ జెప్పుకొనెను. శైలికిఁ గొన్నిపద్యములఁ జూపెదను.

నరసింహశతకము

క. రామవిశాలపరాక్రమ, భీమసురారి జయకామభీకరపాప
స్తోమవిరామ శుభాకర, నామదయాకరుణనీవు నరసింహహరీ!

క. మున్నుందమ చరితంబుల, నెన్నంగాఁ జాలుకాముసీశ్వరవరకో
ట్లున్నారో సర్వేశా, నన్నుందపదాసుఁజేయు నరసింహహరీ! 21

## తిమ్మరాజు పేరకవి

ఈకవి సచ్చిదానంద స్వరూపుఁడు. ఇతఁడు బడగలనాటికన్నడి కులుండు. పాపయ్యపుత్రుఁడు. మౌద్గల్యగోత్రి, ఆశ్వలాయనసూత్రుఁ డు. 1892 క్రీ॥శములో నీతని శతకము ముద్రిణ మందెను. ఈతఁడు శ్రీరఘురామశతకమును, ఆత్మారామశతకమును వ్రాసెను. రెండు శతకములును వేఱువేఱుకవులు వ్రాసినవేమో సందియము కలుగు చున్నది. రెండుశతకములనుండియుఁ గొన్నిపద్యములు శైలికిఁ జూపు చున్నాను.

శ్రీరఘురామశతకము.

సీ. మధుఘృతశర్కర మాధుర్యములకంటె రామనామమును భారసముతీపు
దధిచూతజంబీర ద్రాక్షాఫలముకంటె, రామనామమును భారసముతీపు

గుడమిశ్రమాపూప గోక్షీరములకంటె, రామనామము సుధారసముతీపు
పనసరంభకపిత్థ ఫలరసంబులకంటె, రామనామము సుధారసముతీపు
అన్ని మాధుర్యములకంటె నధికతీపు, రామనామంబు భువిలోన రామచంద్ర
రామనామంబుతో సాటి రాదునెద్ది, రామ రఘురామ శ్రీరామ రామరామ। 13

సీ. రామచంద్రునివంటి రాజుగల్గెనెగదా, పవనతనయునివంటి భటుఁడుగలఁడు
నారసింహునివంటి నాథుఁడుంటేగదా, దానవసుతవంటి దాసుఁగలఁడు
నారాయణునివంటి పూర్ణుఁడుంటేగదా, వైనతేయునివంటి వాజిగలఁడు
దశరథాత్మజువంటి యనఘుఁడుంటేగదా, యల విభీషణువంటి యాప్తుగలఁడు
రాజనాథత్వ పూర్ణత్వ యశములెల్ల, నీకుతగుఁగాక నితరుల కగునెయక్త
మిమ్ము నిరయవసౌఖ్యంబు లిష్టముగను, రామరఘురామ శ్రీరామ రామరామ॥

## ఆత్మారామశతకము.

క. జటధరుఁగిరియలంగెడి, కటినజుసుకన్న దేవకర్తలుగలరా
ఇంటికి మంటికినొకరై, యంటియు నంటకయె వెలుఁగు నాత్మారామా!॥

క. జననం బందినయప్పుడె, ఘనకర్మంబులకుఁ జోరును గావున మఱలన్
జననంబులేని నిరవయ, మునుపొందిన వాఁడెసుఖుఁడు నాత్మారామా!॥

# పసుపులేటి వేంకటదాసు

ఇతఁడు చంబకూరిపురిహరిశతకమును వ్రాసెను. కవి వివరము లేమియుఁ దెలియవు. 105పద్యము లున్నవి.

క. హేరంబుని భారతినిన్, పేర్మిగల శుకుని మేటి పెద్దనకవినిన్
సారెకు వాక్శుద్ధికినై, కోరెదలక్ష్మీశ చంబకూరిపురీశ! 14

క. పరనిందాత్మస్తుతిరతి, పరధన పరదారగమనపరులగువారే
దురితంబున కేగుదురో, గురుతుగ లక్ష్మీశ చంబకూరిపురీశా! 39

# గురురాజకవి

ఈకవి శేషధర్మములు వ్రాసి బళ్లారిమండలము సందలి జోహారాపురాధిపతి యగుసంజీవరెడ్డిగారి కంకితము చేసినట్లున్న. కవి నలు

వది యేఁబది సంవత్సరముల క్రితమువాఁ డనియుఁ, గవులచరిత్రమునఁ దున్నది. ఈకవి పద్మావతీతరిణయము (నాటకము) రుక్మిణీపరిణయము (పద్యగద్యకృతి) రాఘవేంద్రాష్టకము, అనిరుద్ధచరిత్రము (నాటకము) భర్తృహరి శతకములను వ్రాసి కర్ణాటకృతులఁగూడ వ్రాసెనట! ఈతనిభర్తృహరి తెలిఁగింపు నాకుఁ జిక్కనందున శైలికిఁ బద్యము వ్రాయ లేకపోతిని. కవి క్రీ॥ శ॥ 1850 ప్రాంతములవాఁడు.

---

# తటవర్తి వేంకటమంత్రి

తటవర్తివారు తణుకుతాలూకా మల్లేశ్వర గ్రామప్రాంతములఁ జాలప్రసిద్ధి గలవారు. వీరిలోఁ జాలమంది తెలుఁగునఁ బ్రసిద్ధపండితు లుండిరి. తెలుఁగుభారతమును వీరిలోఁ గొందఱు వచనముగఁ సంపూర్ణముగఁ బుస్తకసహాయము లేకుండఁ జదువఁగలిగినవారు. అందులకై వీరికి బొబ్బిలి, పిఠాపురాస్థానములలో భూములు, వార్షికములు నొసంగిరి.

ఈవంశములోనివాఁడైనతటవర్తి వేంకటమంత్రి యేయూరి వాఁడో యేకాలమువాఁడో తెలియదు. ఇతఁడు రమారమనోహరశతకము వ్రాసెను. విష్ణుస్తవాత్మక మైనది. వియ్యూరి కృష్ణమంత్రిపుత్రుఁడు. క్రీ॥ శ॥ 1850 ప్రాంతమువాఁడు కావచ్చును.

రమారమనోహరశతకము.

ఉ. శ్రీరఘువంశ సంభవమునీవక సన్మునిపుంగవప్రభా
ధీరమనోవికాస కరధీబల రావణసంహారక్రియా
కారదిశాంతశాత్రవనికాయభుజంగవిరాజ రాత్రిసం
చార సరోజసోమసురసారసహంస రమారమనోహరా॥

ఈతని పెంపుడుకొడుకగు కొండయ రామశతకము వ్రాసెను.

---

# తటవర్తి కొండయ

ఈతఁడు పైవేంకటమంత్రి దత్తపుత్త్రుఁడు. వీరిది కౌండిన్యసగోత్రము. ఇతఁడు రామశతకము, మల్లేశ్వరశతకమును వ్రాసెను. రామశతకమునందు రామాయణకథ కలదు. మల్లేశ్వరస్వామి రామచంద్రపుర ముతాలూకా మసగపల్లి గ్రామమున నుండెఁగాఁబోలు. రెండు శతకముల నుండి రెండుపద్యములఁ జూపెదను. కవి యేఁబదిసంవత్సరముల క్రిత మువాఁడై యుండవచ్చును. (క్రీ॥ శ॥ 1870.)

## (1) రామశతకము.

క. కుశికాన్వయుఁడగు ముని మిము, గుశలముఁబొందింపఁదలఁచి కోరికలొప్పన్
దశరథునకు సూమహిమలు, విశదముగాఁ దెలిపి మిమ్ము వేడెనురామా!

## (2) మల్లేశ్వరశతకము.

సీ. శ్రీగణాధ్యక్షునిఁ జిత్తంబులోనిల్పి, భారతీదేవికిఁ బ్రణుతిఁజేసి
శ్రీమహావిష్ణుని సేవించిమదిలోన, పద్మాసనస్థుని భక్తిఁదలఁచి
వరమహాలక్ష్మికి వందనంబొనరించి, నగరాజకన్యకు నతులొనర్చి
సురమునివరులను సరవితోఁబూజించి, యిష్టదైవతముల నెలమిఁగొల్చి
కాళిదాసాది కవులకుఁ గరముమొగిచి, సీసశతకంబుఁ జేసెదఁ జిత్తగింపు
పండితోల్లాస మస్కగపల్లివాస! భవభయవినాశ! మల్లేశ! పార్వతీశ!

---

# కామేశ్వరకవి

---

ఈకవి బ్రాహ్మణుఁడు, కాశ్యపగోత్రుఁడు. శ్రీరామప్రభుశతకమును రచియించెను. కవివివరములుకాని కాలముకాని తెలియదు. ఇది సంపూర్ణముగ ధూర్జటికాళహస్తీశ్వరశతకమును విష్ణుపరముగ మార్చినశతకము. అందలిభావములు, ఎత్తుగడలు, పదములు, వాక్యములు నిండనేకము చేరినవి.

### రామప్రభుశతకము.

శా. శ్రీమత్తారక నామరామ జయలక్ష్మీధామ నీలాంబుద
శ్యామా నైరవిరామ రూపలలితాశ్యామావళీకామ సు
గ్రామోద్దామ రచింతు వృత్తశతకగ్రంథంబు నీపేరని
ష్కామాసక్తిని సావధానమతి నాకర్ణింపు రామప్రభో॥ 1

శా. ఏనాఁడాప్తుడు పక్షిరాజుకవి రాజేనాఁటి చుట్టంబు లం
కానాథానుజుఁ డెన్నినాళ్ళ హితుఁడా కంఠీర వాఖ్యాత్మజుం
డేనాఁడాత్మ కిరాతి నేఁడవనిలో నేనాఁటిచుట్టంబ యా
నేనే యన్యుఁడనైతినా పరసతీనిష్కాముఁ రామప్రభో॥ 13

# తోట వెంకటనృసింహకవి

ఈకవి కల్లూరివాసి. తోఁట నరసింహ ఎఱుకలాంబల పుత్రుఁడు. చిననాగయదాసు మందిరమున నీరామునకు వెలసెనఁట. ఇది శుక్లనామసంవత్సర మార్గశిరబహుళ బుధవారము వ్రాసితి నని కవి గద్యలోఁ జెప్పెను. ఇందు నీతి, పిండోత్పత్తి, సంసారపరిభ్రమణము, మహాభూతోత్పత్తి మొదలగు విషయములఁ జర్చించెను. పాటవలెఁ జాలమంది యీశతకము చదువుచుందురు. ఇట్టిదే నారాయణశతక మొకఁడున్నది.

### రామరామశతకము.

పా. జీవుఁడే యీశ్వరుండు, తలపోయ జీవుఁడే పరమాత్మయు
జీవుఁడను భ్రాంతివిడువ, యఖిలంబుజీవుఁడో రామరామ. 13

ఈముక్తికి గర్భమిపుడు, దాఁటినను నిఁక కర్మములను జేయును
సామి కడతేర్చుమనుచు, సుజ్ఞానివలె వేడురామరామ॥ 32

# తోట రాజేంద్రకవి

ఇతఁడు పరశురామశతకము "వరసుధాధామ సద్గురుపరమ రామ" యనుమకుటముతో పరమరామశతకమును, "చిత్కళాసాంద్రశ్రీతోట శ్రీగజేంద్ర" యను గజేంద్రశతకమును, కొ పెలపాటలు వేదాంతకీర్తనలు వ్రాసెను. ఇది బ్రహ్మవిద్య, ఇది తత్త్వవారాశి, ఇది బ్రహ్మసాయుజ్యము, అను శీర్షికలక్రింద విభజించి వేదాంత బోధకముగ వ్రాసెను. ఈ తోటవారిశతకములు చాల వ్యాపిసియున్నవి.

"ఆంధ్రప్రదేశంబున * *
కుండినదేశంబునకు నందు! పురుషోత్తపట్నంబు! పొలుపొందు శ్రీతోట
రాజేంద్రుఁడను వాఁడనీ కరుణనుండువాఁడ."

ఈకుండినసీమ గుంటూరుమండల మని కొందఱ అనుచున్నారు.
శైలి కొకపద్యము.

హస్తగతమైన బ్రహ్మంబు నాశ్రయింప, లేక భ్రమపడు మనుజు లెందైన మంత్ర
తంత్రములయందుఁ బడుచుండు ధరణిమీఁద, చిత్కళాసాంద్ర శ్రీతోట శ్రీగజేంద్ర॥

# కొర్లానపురి బుచ్చిరామయ్య

వివరములేమియుఁ దెలియవు

నృసింహశతకము.

వాసిగ బ్రహ్మోపనిమానము, భాసురగతి గాచినట్టి బల్ శ్రీకృష్ణా
నోసిలియొగ్గియు వేశిన. కాసింతయు మనసుకరగి కావు నృసింహా॥ 53

# కదిరికవి

ఈకవిపేరు కదురుఁడో, అంకేంద్రుఁడో తెలియుటలేదు. రెండుప్రతులలోను సందిగ్ధముగ నున్నది. "దారోజగన్నాయకా," యను

రఘు

మకుటముతో నొకజగన్నాయకశతకము వ్రాసెను. కవి సింహాద్రినంద నుఁడు. వివరము లేమియుఁ దెలియవు.

జగన్నాయకశతకము.

మ. ఘనతన్మీశుభనామకీర్తనల పేక్షుంజేయు మీభృత్యుఁడన్
అనఘుండౌ మహనీయుఁడన్న జెగరార్యస్తోత్ర పాత్రుండు స
జ్జనమాన్యుండు నృసింహసేవకుఁడు సౌజన్యుండు సింహాద్రి నం
*దనుఁడన్ కద్రకవీంద్రనామకుఁడనే దాసోజగన్నాయకా! 110

మ. మత్తేభంబులు హృద్యపద్యమని సంభావింప శార్దూలముల్
మత్తేభంబులు నేటివృత్తములు ప్రేమంజేసితిన్ నూఱు మీ
చిత్తంబింక భవత్కటాక్షమున రక్షింపంగృపంజూడుమీ
దత్తాత్రేయమునీస్వరూప హరి చాల్దారో జగన్నాయకా.

---

## ఆళ్వానుకవి

ఇతఁడు తిండుకవంశజుఁడు. వైష్ణవుఁడు. వానగిరి(వానమామలై) యందలి దేవనాథముని కవికి గురువు. ఇతఁడు కొరిజాత్మపురి వేంకటాఖ్యుని పుత్రుఁడు. ఈయూరు తిర్నల్వేలి మండలములోని యాళ్వారు తిరునగరి కావచ్చునని కొందఱనుచున్నారు. భూతపురాధిపుని యాజ్ఞానుసార మిదివ్రాసెనఁట. స్వప్నములో రంగఁడు తిరుమంత్రోపదేశము చేసి కృతిపతియగు నృహరిభార్యతో మాఱువేషమున నిచ్చి కవితోఁ జుట్టరికము కలుపుకొనెనఁట! భగవంతుఁ డీతనియతిథిగాఁ జిరకాలముండె నని వ్రాసికొనెను. మైలికి "శ్వేతకుభృన్నృకేసరిశతకము"నుండి కొన్నిపద్యములఁ జూపెదను.

శ్వేతకుభృన్నృకేసరిశతకము.

శ్రీకరచంద్రనేత్రముని చిత్తసరోజ విహారపాత్ర ప్రా
భాకరచంద్రనేత్ర సజలాంబుదసన్నిభగాత్ర నిర్జితా

---

* "నందనుఁ డంకేంద్రకవీంద్ర నామకుఁడనేదాసో జగన్నాయకా" అనిపాఠాంతరము

ఘూకరచంద్రనేత్ర విభుదావనిచైత్ర రమాకళత్ర శో
భాకరచంద్రనేత్ర నిరతార్చిత శ్వేతవసుభృన్నృకేసరీ
చల్లని చూపు చందురునిసాటగు మోము విశాలవక్షముల్
దెల్లనిజన్నిదంబు లతి దీర్ఘసుబాహువు లూర్ధ్వపుండ్రముల్
సల్లలితాంశుకంబు శిఖచారుత్రిదండము పాదకాంతి సం
జిల్లయతీంద్రులన్వితిజేసెద శ్వేతవసుభృన్నృకేసరీ.

---

# విస్సాప్రెగడ సూరకవి

---

ఈతఁడార్వేలనియోగి. వేంకటయ, చుక్కాంబలపుత్రుఁడు. ఈతఁడు లక్ష్మీనారాయణశతకము వ్రాసెను. రామచ్ఛాయభావముఁ బద్యము కల్పించినకామరాజీవంశము వాఁడే! నాగుపల్లిపురవాసుఁడగు దేవుని స్తుతించెను. అమలాపురప్రాంతముల నున్న వానపల్లెలో నీవంశము వారున్నారు. కవి గోవిందదేశికేంద్రుని శిష్యుఁడు. వివరములు తెలియవు.

లక్ష్మీనారాయణ శతకము.

జ్ఞానిస్తుతిఁ జెందు విస్సాప్రెగడ స్ఫారాన్వయంబందు తే
జో నిత్యత్వముగల్గు వేంకటయకుం జుక్కాంబకున్ సూతినా
ఖ్యానేసూరకవిన్ మిముఁబొగడినాఁడన్ మమ్ము రక్షించు ల
క్ష్మీనారాయణ మీపదాబ్జములు నాచిత్తంబులోఁ గొల్చెదన్. 101

---

# వక్కలంక సంతయమంత్రి

---

దశరథరామచంద్ర శతకము.

సీ. శ్రీజానకీచిత్త సీమాంతరవిహార, నీరజాతాయత నేత్రసార
సాగసాష్టపవిత్ర సత్కులాధారని, స్సార సంసారగ విదూరదక్షి

క్షీరదైతేయసంహార మాణిక్యహార, యూరభూషిత చిదాకారవీర
వీరాధివీర సన్నీరదాకారశ, రీరపూర్ణప్రభా పూరహార
గీ. హీరకర్పూరతార పటీరహార, తారకానిభకీర్తి విస్తారసార
పోషితమునీంద్ర రఘుకులాంభోధిచంద్ర, రమ్యగుణసాంద్ర దశరథరామ నృపేంద్ర॥

---

# పోలిపెద్ది వేంకటరాయకవి

---

## లావణ్యశతకము.

ఇతఁడు "వశమె శ్రీరామ రామలావణ్యసీమ" యనుమకుటముతోఁ గ నొక శృంగారశతకమును వ్రాసియున్నాఁడు. "అఖండలక్ష్మీక్షేత్ర ప్రసన్నుఁడైన మాకరాజు వేంకటపెరుమాళార్య జనుసరసుఁ డొకనాఁడు కొలువుండి "పురుషవిరహము శ్రీహరిస్మరణశృంగారనామముగ చమత్కృతి శతకం బొనర్చు" మన దీనిని దాను వ్రాసెనఁట! ఇది సీసశతకము. కవిగాని కృతిపేరేపకుఁడుగాని యేకాలమువారో తెలియదు. శృంగారవర్ణన లధికముగ నున్నవి"

సీ. కాలమృత్యువునైన కడకుఁద్రోయఁగవచ్చు, పురవైరితోనైనఁ బోగవచ్చు
గరళంబు మెక్కి నిగ్రహశక్తిఁ గనవచ్చు, నలదవానలము చేనంటవచ్చు
మినుకాఁడుత్రాఁచును విసరిత్రాళ్ళిడవచ్చు, కాలాంతకుని యాజిగడుపవచ్చు
తనువుగోయగ మదిఁ దాళియుండగవచ్చు, పైమాట లోకలక్ష పలుకవచ్చు
గీ. నజ్జభవునకునైన నయ్యాఁడువారి, వలపుఁగోలిపెడి బెళుకుచూపులను వేడి
తూఁపులకు నానిచిత్తంబుతో సహింప, వశమె శ్రీరామ రామలావణ్యసీమ॥

సీ. మనసెఱుంగఁగరాదు మాటనిల్కడలేదు, వావివర్తనహీ వలపునున్న
కనువిచ్చిచూడరు చనవచ్చికూడరు, నేస్తంబుపూజ్యంబు నెసరునాస్తి
మర్యాదలెంచరు మన్ననఁగాంచరు, గుణముచక్కనయుఁ గలుగుటయుఁగల్ల
కపటంబుమానరు కడువేడ్కఁబూనరు, సత్యమాతలఁబెట్టు జాలిమట్టు
గీ. సాహసముమెండు మనమునఁ జలమునిండు, అంగిటవిసంబు నాలుకయందుదివ్య
దనముగదె చేడియల నుంచితనమునమ్మ, వశమె శ్రీరామ రామలావణ్యసీమ॥

ఈతఁడే వేణుగోపాలశతక మనునిందాగర్భమైన ప్రసిద్ధశతకము వ్రాసినవాఁ డనికొందఱు చెంగల్పట్టుమండలమునఁ జెప్పఁగా వింటిని. సత్యమనుటకు సాక్ష్యము లేదు.

---

## టంగుటూరి సుబ్బకవి

ఇతఁ డింతిమక్కాల కోదండరామునిపైఁ గోదండరామశతకము వ్రాసెను. ఆర్వేలనియోగి, నరసింహకవిపౌత్రుఁడు, కొండమంత్రిపుత్రుఁడు. ఎప్పటివాఁడో తెలియదు. శైలికిఁ గొన్నిపద్యములు.

### కోదండరామశతకము.

క. ఘోరతరాకారంబుల, మారిచసుబాహులనెడు మనుజాశులఁ బ
ద్ధీరతరాఁ గూల్చినరఘు, వీరా కోదండరామ వినుతవిరామ|| 19

క. పరగునభరతుఁ డయోధ్యా, పురవరమున కరిగి కైకబూనిన కార్యం
బెఱిఁగెనుగద! సురనుతపద, సరసిజ కోదండరామ సంగరభీమా|| 42

క. శరభంగునాశ్రమంబున, కరుదెంచిన నామునీంద్రుఁ డతిముదమున మీ
చరణంబులఁ బూజింపఁడె, వరదా కోదండరామ వరశుభనామ|| 60

---

## తాండవకృష్ణదాసు

ఈతఁడే "ఆసూరిరామానుజులు." వేంకటకృష్ణభట్టరుశిష్యుఁడు. శతకాదిని వైష్ణవగురువుల స్తుతించెను. శ్రీరంగరంగేశ్వరశతకమును రచించెను. శైలికిఁ గొన్నిపద్యములఁ జూపెదను.

### శ్రీరంగరంగేశ్వరశతకము.

మ. ననుఁగన్నయ్యవు నీవు నన్నుమనుపన్ న్యాయంబుఁగాదంటె యె
వ్వనిపాలౌదును తండ్రికాదనిన నమ్మంజాలఁగావచ్చు గా

పున వావ ల్లపరాధమే మిపుడు నీవుత్తాదక్కినన్ నన్నుఁ గాం
చిన మాతల్లగు లక్ష్మిపాల్పడియెదన్ శ్రీరంగ రంగేశ్వరా॥ 12

శా. జ్ఞానాగణ్యగురూపదేశనయ సంకల్పంబునం గాక యు
జ్ఞానాచార్యులఁ జేర ముక్తిఁ గలదే గౌరవ్యతన్ స్వాతిమేల్
వానం గాక మహాన్నిమేఘములు పైవర్షించినన్ శుక్తులన్
శ్రీనవ్యామల మౌక్తికంబులగునే శ్రీరంగ రంగేశ్వరా॥ 13

మ. అనురాగంబున కన్నపట్టియని నెయ్యంబారఁగా సింధునం
దనయడ్డాల నమర్చి లాలనల చేసన్ స్తన్యపానాద్యముం
బున సంతృప్తినిఁ జేయు టెన్నఁటికి సొంపున్ నీవు నన్ గ్రేపుఁగాఁ
చిన పుత్రుండని యొత్తి పెంచు టెపుడో శ్రీరంగ రంగేశ్వరా॥ 14

# ముడుంబై వేంకటరామనృసింహాచారి

కవివివరము లేమియుఁ దెలియవు. శ్రీవైష్ణవుఁడని యూహింపవచ్చును. రంగేశ్వరకృష్ణశతకము వ్రాసెను. రుక్మిణీకల్యాణ కథాత్మక మగు నీశతకము మనోహరముగ నున్నది. శ్రీ[illegible]మునకు దగ్గర నున్న వంశధారాతీరమందలి యచ్యుతపురి వాసుఁడు.

## రంగేశకృష్ణశతకము.

సీ. నెరివిరిసరులు నీకురులు బట్టెనుగద, మణికిరీటమున నీమస్తకంబు
తాకట్టుబడియెగద రతనంపుఁ బాహు, పురులు నీనిగిగి బాహువులనుగ[illegible]
గదనీ వెడదరొమ్ము కమలామహాదేవి, యాక్రమించెనుగద యమునిసగము
సుధ వేగఁ దెమ్మని సురలు నీవీఁపున, మోపిరిగద యెంత మోసకారి
గీ. వకట! యిటువంటినిన్ను వేదాంతములు స్వ, తంత్రుఁడవటంచు బలికెఁ [illegible]
నర్థభేదము గనఁబడు నయ్య మాకు, మీశభవత్పృష్ణ రంగేశ వేషకృష్ణ॥
సీ. బంగరుమెఱుఁగు దువ్వాలువతోఁ బిక్కల, దాకజీరాడు నిద్రాహారంగు
జేతులతోఁ గెంపు వాతెర తెలిగప్పు, చిరునవ్వుతోఁ దొగ చెలిచెలువము
డిగిచి కొన్నట్టి నెమ్మొగముతో నీలంపు, దిమ్మలనియగ్రేవ దిద్దినట్లు
దొదరు వెడఁదరొమ్ము తోనవలామూక, బొడువ మరుంగొగ వెడలిచిసగ

గీ. టాకిజిలుగు మిటారిపుటారుతోడఁ, గన్నులనుగట్టి యావెన్క గానరాక
నింతి నలయింప నీచిత్త మెట్టులోర్చె, వీతభవతృష్ణ రంగేశ వేష కృష్ణ॥ 46

సీ. అతియుఁడీ మనవిప్రుఁ డచటికేగెనొ లేక, యన్నకుజడిసి తానాగెనేమొ
జనినను ప్రాణేశు సమయమయ్యెనొ లేక, నరుగ నసందర్భమాయెనేమొ
వెతతెల్ల టునిపైని పడువనొనో లేక, పగవారికోర్కల్ పండునేమొ
స్తవమింకైనను దయజూచునో లేక, దయమాలి వేలుగాదలచునేమొ

గీ. ఏగిటాగాయె విప్రుఁ డదేలరాఁడు, వేలుగాఁ దోఁచుచున్నది వెఱఁదులార్ప
యనుచు చెలి సందియముఁజెందు మనమునందు, వీతభవకృష్ణ రంగేశ వేషకృష్ణ॥ 47

---

# పరశురామ నరసింహదాసు

ఇతఁడు భద్రాద్రిరామశతకమును 101 పద్యములలో వ్రాసి శతకాంతమునఁ దన్నుగూర్చి వ్రాసికొనెను.

ఈతఁ డేకాలమువాఁడో, యెచ్చటివాఁడో వివరములు తెలియవు. కోటీశ్వర సుబ్బమాంబలపుత్రుఁ డనియు, కంభాలూరియప్ప గురునిశిష్యుఁ డనియుమాత్రము తెలియుచున్నది. శైలికిఁ గొన్నిపద్యముల మాత్రము చూపుచున్నాను. ఇందు హఠయోగానుసారము వేదాంతవిషయములే కనఁబడుచున్నవి.

## భద్రాద్రిరామశతకము.

సీ. శ్రీజానకీరామ సేవకసుత్రామ, రఘుకులాంబుధిసోమ యఘవిరామ
పతితపావననామ భవ్యపరంధామ, కరుణాలలామ సంగ్రామభీమ
వారివాహశ్యామ వరతులసీదామ యమితవిక్రమ త్రిలోకాభిరామ
విరచితభార్గవగామ వినుతశర్వాణిస్తోమ సంపూర్ణకామ సత్యార్థధామ
భక్తమందార నగధీర భయవిదూర, దనుజసంహార విమలవేదాంతసార
రమ్యగుణధామ భద్రాద్రిరామ, సత్యకామ కరుణాలలామ లోకాభిరామ.

# సందడి నాగదాసు

ఇతఁడు (1)శ్రీలక్ష్మీనారాయణశతకము (2) శ్రీపతిశతకమును వ్రాసెను. ఈకవి శాలివాహనశకవర్షంబులు "ఋతునభదిగ్గజసోమ సంఖ్య"ను వ్రాసినట్లు శతకాంతమునఁ జెప్పుకొనియెను. క్రీ॥శ॥ 1884 కావలెను. తారణ మార్గశీర్ష శుద్ధతదియలకు ముగించెను. ఇతని చిన్నతనమున భాగవతశ్రవణ మొనరించెను. మాత్రాగ్రములు వేంకట రామగురుఁడు చెప్పెను. యోగవిద్య వేంకయగురువు చెప్పెను. శ్రీపతి శతకము శా॥శ॥ 1809లో ముగించెను. (శకాబ్దములు నిధిఖశిప్వసా సంఖ్యోరుబలంబున.)

శైలికిఁ గొన్నిపద్యములు.

శ్రీపతి శతకము.

ఉ. ఎప్పుడు స్వప్రకాశమున నిద్ధరనాత్మ వెలుంగుచుండ గ
న్గొప్ప కొకప్పుడున్మనసుగూర్చిన నేమగునంద్రు కొందఱో
చొప్పదిగాదు నొక్కపరిఁజూచిన వస్తువు కండ్లఁగప్పిన
ట్లొప్పనుగాన చిత్తలయ మొక్కపదైన నొసంగు శ్రీపతీ.

శ్రీలక్ష్మీనారాయణశతకము.

సీ. నీదాసవరులసన్నిధి గల్గినటులైన, వైకుంఠమునకేగు వాంఛయేల
నీదాసవరుల వర్ణింపఁగల్గినజాలు, నితరదేవతల సన్నుతులవేల
నీదాసులనుపూజ నిత్యజేసినజాలు, విగ్రహార్చనమీఁద వేడ్కలేల
నీదాసవరుల ప్రమోదింపజేసిన,చాలు యజ్ఞముఁజేయుశీలమేల
గీ. యట్టి నీదాస సాంగత్య మనవరతము, గలుగవరము ప్రసాదింపవలయు దేవ
నతజనసురక్ష ఘనకరుణాకటాక్ష, లక్ష్మీనారాయణాబ్జాక్ష లలితవక్ష.

---

# రేమెల రామదాసు

ఇతఁడార్వేలనియోగి. అప్పయ వెంకమ్మల నాల్గవపుత్రుఁడు. ప్రతివాది భయంకర ఆర్యలింగాచార్యుల శిష్యుఁడు. పిఠాపురము

జమీందారులప్రాపకమున దుగ్గుమర్తిలో నుండువాఁడు. శ్రీరావుగంగాధరరామారావుగారిని బేర్కొనెను. శైలికిఁ గొన్నిపద్యములుచూపెదను. కవి క్రీ॥ శ॥ 1870 ప్రాంతములవాఁడు.

### మహిజామనోహరశతకము.

ఉ. రంగదరాతిభీష మణిరాజవిరాజితభూష గోపికా
సంగసమగ్రవేష ననయంబున దాసజనాళిపోష ని
ర్భంగతరంగసంఘముల పాపపయోనిధి శోషకామ దు
స్సంగతిఁబొందకుండఁగను జేయఁగదే మహిజామనోహరా|| 34

ఉ. పాపపుబుద్ధిచేత బహుపాపము లాజ్ఞఁ జేయుచుఙ్ఞ మరా
లాపము లాడుచుండె నని రాఘవరామ తలంపకయ్య నీ
దాపునఁ జేరియుంటి నను దాసునిఁగాఁ గృపఁజూచి నేరముల్
కోపములేకఁ బాపఁగదె కూరిమితో మహిజామనోహరా|| 81

---

## తాతరాజు వేంకటసుబ్బదాసు

---

ఇతఁడు కోరుమామిడి పురమునందున్న చక్రపాణిపై విరహిణిశతకము వ్రాసియుండెను. ఇతఁడు చలమయామాత్య పుత్త్రుఁడు. కాశ్యపగోత్రుఁడు. యజుర్వేదసూత్రి మంత్రితత్త్వజ్ఞాన మహిమవేత్త నని చెప్పుకొనెను. (138) క్రీ॥శ॥ 1870 నాఁటికే శతకము ముద్రితము. కవి యెప్పటివాఁడో తెలియదు. ఈతని చక్రపాణిశతకమునుండి యొకపద్యముఁ జూపెదను.

### చక్రపాణిశతకము

సీ. శ్రీకృష్ణుఁ డీవేళఁ జెలికాండ్రఁ గూడుక, శృంగారవనికి సుశ్రీకరముగఁ
విహరించుటకు జని విడిదికి రాఁడయ్యె, నిదియేమి చోద్యమో యిగురుబోఁడి
పతిని నే నిమిషంబు జతఁ బాసియుండఁగను, నే నెటులీ రేయి నిదురఁ బోదు
పతిపూయతలే వేళ నతిప్రీతితోనుఁ జూచి, యతనిఁ గూడుటకు నైయంపెనమ్మ

శ్రీరామగవారు నూతనప్రియులుగాక, వారినప్పుట వలదమ్మ వనితలనుచు
గోరుమామిడి పురవాసుఁ గువలయేశు, చక్రపాణినిఁ దేగదే చంద్రవదన !

---

# కైవరపు నారాయణకవి

---

ఈతఁ డఖిలవేదాంత ప్రతిపాదకంబగు నమరనారాయణశతకము వ్రాసెను. ఇది నీతిశాస్త్రశతకమని కవి (4) వ్రాసెను. కవి వివరములుకాని, కాలముకాని తెలియదు. గురుఁడు శ్రీవిష్ణువని నత కాంతపద్యమువలన నూహింప వీలగుచున్నది.

అమరనారాయణశతకము.

సీ. కాయంబుపైనాస కాంతనిలుపడు, వరకవియగు యోగివరుఁడు భువిని
అతిథులపైచాల నతిప్రేమతోనుండు, వరకవియగు యోగివరుఁడు భువిని
సకలజీవాత్మల సమముగాభావించు, వరకవి యోగివరుఁడు భువిని
పొట్ట బట్టకను బహుపొట్టయిన వగవఁడు, వరకవి యగు యోగివరుఁడు భువిని
ఇన్నిగుణములు గలిగిన కవీశ్వరుండు, భగవదనుభవమొనరించు భక్తినెపుడు
అమరనారాయణాచ్యుత హరిముకుంద, దురితదూరక! కైవరపురివిహార!

---

# మండవేముల వెంకయ

---

ఇతఁడు సచ్చిదానందరామశతకము వ్రాసెను. వేదాంతప్రతిపాదకమగునీశతక మెప్పుడువ్రాసినదో తెలియదు. శైలికిఁ గొన్ని పద్యములఁ జూపెదను.

సచ్చిదానందరామశతకము.

శ్రీకరుండ సకల సురసేవితుండ, నిర్వికల్పుండ నిత్యుండ నిర్మలుండ
నాశరహితుండ శరణు శ్రీనాయకుండ, సవనుగుణధామ సచ్చిదానందరామ.

బద్ధకేలయ్యా ననుగన్న ముద్దులయ్యా, రద్దుజేయక వడినిందు రాఁగదయ్యా
కలుషజాలంబులను ద్రుంచి కావవయ్యా, నవసుగుణధామ సచ్చిదానందరామ.

---

# శౌనక కృష్ణయార్యుఁడు

ఈతఁడు కోటిఫలిఁ (కోటిపల్లి, గోదావరి) యందు వెలసిన శ్రీరాజరాజేశ్వరి కంకితముగ నొకశతకము వ్రాసెను. కవిరామప్ప భూదేవపుత్రుఁడు. ఇతర వివరములు తెలియవు. శైలికిఁ గొన్నిపద్యములు.

### శ్రీరాజరాజేశ్వరీశతకము.

శా. కాలోన్మత్త వినీలకాసరగళగ్రైవేయ ఘంటోద్భవ
ద్వేలాధ్వానము నెన్నఁడు న్వినఁడు త్వత్కీర్తిస్ఫురన్మల్లికా
జాలానర్గళ దివ్యసౌరభఝరీ చంచన్మహద్వీచికా
మాలంగ్రాలు వివేకికోటి ఫలిశ్రీమద్రాజ రాజేశ్వరీ.

శా. పాపాఘైక్యవినాశినీకృపతుసద్వామాంగ సంకాశినీ
తాపారణ్య విభేదినీసుఖదినీ దైన్యావనామోదినీ
కాపట్యంబెడఁజేయుచున్నము సదాకాపాడు నీవెమ్మొయి
న్నాత్రపాలాగదవమ్మ కోటిఫలి శ్రీమద్రాజరాజేశ్వరీ. 38

---

# జయంతి కామేశ్వరకవి

ఈతఁడు జానకీవరశతకము వ్రాసెను. హైకోర్టులో వకీలుగా నుండెను. రామభక్తశిరోమణి యని పేరొందెను. జానకీపతిశతకమున ముకుందమాల పోలికలున్నవి. శైలి మృదుమధురము. శైలికిఁ గొన్ని పద్యములఁ జూపెదను.

### జానకీవరశతకము.

ఉ. కోరను వాజులన్, గరులఁగోరను, హాటకసంచయంబులన్
గోరను, నాకభోగములఁ గోరను, దక్కిన కోర్కులేమియున్
గోరను, నీపదాంబుజయుగం గోరితి, దాఁచక చూపునాకు, నీ
సారసనేత్ర, దానఁ గడు సంతసమొందెద, జానకీవరా.

ఉ. స్నానములెన్ని చేసినను, సంధ్యల గింధ్యల నెంతవార్చినన్
గాననవాసులై యెపుడు గందములే భుజియించుచుండినన్
మానసమందుఁ నీస్మరణ మానక చేయని మానవాధముల్
గాఁనగలేరు ముక్తిఁ జిరకాలముకైనను, జానకీవరా. 15

---

## ఆదూరి కృష్ణయ్య

---

ఈకవి నారాయణశతకము వ్రాసెను. ఇతఁడా త్రేయ గోత్రుఁడు. దీనినే గుజలీవారు పెద్దనారాయణశతక మందురు. మత్తకోకిలాదివృత్తముల వంటిపాటలఛందములో వ్రాసెను. వేదాంతప్రతిపాదకము. కవి "ఆదూరి యెంబెరుమాళ్ళు" పుత్రుఁడు. శైలికఁగా సి పద్యములఁ జూపుచున్నాను.

### నారాయణశతకము

జననంబు కోటియుఁజేసియున్ జనరక్షకర్తవు నీకుఁ దా
ననమంపుకొందఱు రక్షకై తగనిన్ను పూజలు చేసియున్
ననువొంద నెమ్మది నుండినన్ దలిభక్తిమొక్కఁడు దిప్పుడున్
ననువంటిదీనుని బ్రోవవే! నారాయణా! నారాయణా॥
కవులెల్ల సమ్మతిగాఁగనే ఘనిసమార్గలక్షణయుక్తమై
వివరింపఁజాలని నిన్ను దావినుతింపఁ జేసిన దేవరా
భువినిన్ను సత్కవులాదిగా బుధులెల్ల మెచ్చఁగ సేయగో
నవమోహనా భవభంజనా నారాయణా నారాయణా॥ ౩౮

---

# పోతుల వేంకటరామకవి



ఈకవి పెన్నపట్టణవాసి. శ్రీకృష్ణనాటకము, ఉషానాటకము మల్లికార్జుననాటకము, శ్రీవేంకటేశ్వరకృతులు, మొదలగు గ్రంథముల వ్రాసెను. ఇతఁడాదిశాఖవాఁడు. కౌండిన్యగోత్రుఁడు, రామమంత్రి పౌత్రుఁడు, వేంకటాచలప్రధానిపుత్రుఁడు, నని యొకపద్యమున వ్రాసెను. ఈతని కుక్కుటేశ్వర శతకమునుండి కొన్నిపద్యములఁ జూపెదను.

కుక్కుటేశ్వరశతకము.

నేరకఁ గొన్నియున్ మఱియు నేరిచియుండియుఁ గొన్ని పాపము
ల్గూరిమిఁ జేసితిన్ సుజనకోటిని దూఱితి మోసపుచ్చితిన్
నేరములెన్నొ చేసి తుదినీపదభక్తుఁడనైతి నిప్పుడే
తిరున గాలపాశమున తీవ్రతబాపెదొ కుక్కుటేశ్వరా॥ 10

బంధుగులన్నదమ్ములును భార్యయు బుత్రులు మిత్రులున్గురు
ల్పొందుగఁ దల్లిదండ్రులును బొల్పదలిర్పఁగ భృత్యవర్గముల్
యుందఱునున్నగాని తనువెవ్వరు నాపఁగలేరు ప్రాణముల్
బొందినిఁబాసిపోవుతఱి భూరికృపాకర కుక్కుటేశ్వరా॥ 30

---

# నిమిషకవి వేంకటేశకవి

చెన్నమల్లయ గోత్రోద్భవుండును తాతయ వెంకమలపౌత్రుండును, వేంకటరావు చెల్లయాంబల పుత్రుండును, నగు జగన్నాథరావున కంకితము. ఈజగన్నాథరావు యోగి యయ్యెను. ఈతని కంకితముగఁ బైకవి యీజగన్నాథయోగిశతకము వేదాంతప్రతిపాదకముగ రచియించెను. కవి క్రీ॥శ॥ 1850 ప్రాంతమువాఁడై యుండవచ్చును వైలిశ్లోక పద్యము.

జగన్నాథయోగిశతకము.

సీ. పటికంపుజాయయు వసదనినాదంబు, మహితాదిశక్తియు మత్స్యముద్ర
దనరువిశుద్ధాఖ్య తామరసంబొగి, తావుమూలల తావునందు

బడియూరుదశకములఁ బఱగుచున్వరములు, నీజాక్షరంబులై తేజరిల్లు
నాకాశతత్త్వమై యమరిమరాశను, లోకవేయి యూపింగఁ బ్రకటితమగు
నందు నీశ్వరుఁ డధిదేవుఁడై చెలంగు, గురునిసేవించి సాత్వికగుణముఁ గాంచు
నాతఁడే ధాత్రియోగి యానంద్రముఖపులు, జ్ఞానభోగి!గోదే జగన్నాథయోగి!|| 42

# కొమఱ్ఱాజు వేంకటశివుఁడు

ఈతనివ్యవహారనామము వేంకటప్పయ్య. రేపాలరాజలింగశతక మీతనికృతి. (వెనుకను 407 పుటచూడుు) ఉద్భటారాధ్య శిష్యుఁడగు వీరభద్రగురుశిష్యుఁడు. ఈకవి మునగాలప్రభువగు. శ్రీరా॥నాయు నిలచ్చమ్మారావుగారి మంత్రి. (1831 క్రీ॥ శ॥) శివతత్త్వసుధానిధి యనుకావ్యమున కీకవి ప్రోత్సాహకర్త. అది శ్రీకందుకూరి వీరేశ లింగముపంతులుగారి కవులచరిత్ర కొంతకీయుఁగాఁ బారవేసిరఁట! ఈ కవి మఱియొకశతకమును, జ్యోతిష గ్రంథమునుగూడ వ్రాసెనఁట. కృష్ణామండలము నందిగామతాలూకా పెనిగంచిపోలు నివాసవ్యుఁడు. భరద్వాజస గోత్రుఁడు. శైవుఁడైన మాఊవేలనియోగి. నాల్గుతరి ములకిందఁ శైవులైరి. వైష్ణవులతో వీరికి సంబంధము లున్నవి.

రేపాలరాజలింగ శతకము.

సీ. శంకరపరమేశ శాశ్వతసర్వేశ, కాలకాలాంతక గంళకంఠ
చంద్రశేఖరభీమ శంకరిహృదయేశ, సర్వమహాదేవ శరనిభాంగ
ఫాలనేత్రగిరీశ పంచాక్షరీరూప, భవహరపురహర భక్తవరద
గంగాధరసురేశ కంజాక్షసన్నుత, భుజగభూషణ దీనపోషసోమ
యనుచు పఠియించువారికి ఘనతమీర, మోక్షసత్రంబులేసిన దీక్షనీద
భావభవభంగ గౌరి హృత్పద్మభృంగ, రాజితశుభాంగ రేపాలరాజలింగ|| 8

పోతన్న భాగవతమునందుఁ జాక్షికుఁడై వ్రాస్తవంబులు కొన్ని వదలినట్లు కవివ్రాసెను. దీనినిఁబట్టి వీరభద్రవిజయరచనమునై నప్పటి పాడుకలును గ్రహింపవచ్చును.

# విజయరాఘవాచారి

ఇతఁడు వైఖానసుఁడు. కృష్ణశతకమును వ్రాసెను. రఘునాథభట్టరాచార్యుని నప్త్రుఁడు, వనమాలి పౌత్రుఁడు. రామాచారిపుత్రుఁడు. ఆరుగోళపురీశుఁ డగుకృష్ణుని నుతించెను.

కృష్ణశతకము.

సీ. శ్రీవత్సవక్షలక్ష్మీవర కరుణాకటాక్ష వీక్షణసురాధ్యక్షవినుత
ఇందిరారమణ గోవిందముకుంద సమ్మోదనందన నందనందదేవ
కరిరాజవరద సుందరరూపగిరిధర, సరసిజనేత్ర సంస్తవనపాత్ర
అండజవాహ కోదండధరాఖండ, మండలాధీశప్రచండతేజ
యనుచు నీనామకీర్తన లనుదినంబు, భజన సేయుచునుండు నా భావమందు
ఆరుగోళపురీశ శ్రీకృష్ణ! యఘవినాశ, శ్రీశ సర్వేశ వినుత! విశ్వేశయీశా. 1

# భృంగిరిటి బసవయలింగకవి

ఇతఁడు వీరభద్రశతకము వ్రాసెను. ఇతఁడు విశ్వకర్మకులజుఁడు. సుంకరణ వెంకయ యీతనిగురువు. రుద్రేశ్వరులనిఁ గావ్యాదినిఁ దలఁచెను. విశ్వబ్రాహ్మణశబ్దము వాడినందున నీతఁ డాధునికుఁడు. శ్రీరావు గంగాధర రామారాయనింగారు పిఠాపురప్రభువుల 16వ పద్యమునఁ జేర్కొనెను. శ్రీరావురామారాయణింగారినిఁ జేర్కొనెను. క్రీ॥శ॥ 1870 ప్రాంతమువాఁ డనవచ్చును. పట్టిసపుగ్రామము నందలి వీరభద్రున కంకిత మొనర్చెను. శైలికిఁ గొన్నిపద్యములఁ జూపెదను.

స్తవప్రకరణము, యుద్ధప్రకరణము, ప్రార్థనప్రకరణము నని శతకము విభజించి వ్రాసెను.

వీరభద్రశతకము. 7

క. ఇందిరఁ గొలిచెదమది నా, నందంబుగఁ గావ్యసిద్ధికొఱకై నాహృ
న్మందిరమునందు మునిజన, వందిత శ్రీవీరభద్ర పటుతరరౌద్రా.

క. రాజశిఖామణియగు, నారాజా శ్రీరాఘురామగాయనృపాలున్
రాజితసత్కృపనేలును, భ్రాజితశ్రీవీరభద్ర పటుతరగంగ్రా. 17

---

# మీసరగండ మునిస్వామి

---

ఇతఁడు విశ్వకర్మ కులోద్భవుఁడు. ఈతనినివాసస్థానము తిరుపతి కాళ్లేయమూళ్ల పదిమైళ్లదూరమున నున్నవడమాలపేట యనుగ్రామమని శతకాదిని ముద్రాపకులు వ్రాసియున్నారు. క్రీ॥ శ॥ 1850 ప్రాంతములవాఁ డైయుండును. శ్రీరఘురామశతకమును రచియించెను. దీనిలోఁ గొన్నిపద్యములఁ జూపెదను.

### రఘురామశతకము

క. నతులొనరఁజేసి వరసంస్కృతకవులకు నాంధ్రకావ్యకృతినిపుణులకు స
న్నుతిజేసి నిను భజించెదరా, జితముగ శేషాద్రిధామ శ్రీరఘురామా!
క. సురలయితిమి దొరలయితిమి, ధరణీసురలయితిమనుచు సర్వితపసున్నతి
హరి నిన్మరచి సుఖమా, చిరముగ శేషాద్రిధామ శ్రీరఘురామా॥ ౨

---

# ముదిగొండ శంకరారాధ్యులు

---

ఈకవి యాధునికుఁడు. క్రీ॥ శ॥ 1919లో మరణించెను. హనుమకొండ మట్టెవాడనివాసి. 1960000 గణాచ్ఛన మొనర్చి యన్న దానము చేసెను. ఆరాధ్యులకు నాయకుఁడు. ఈతఁడు భావలింగశతకము, చాటుపద్యములు, మానసపూజాద్విపద, శివభజనకీర్తనలు, మల్లికార్జునలింగశతకము, తటస్థగ్రామపంచరత్నములు, మొదలగునవి వ్రాసెను. హెచ్చుగా గీతములు వ్రాసెను.

### భావలింగశతకము.

ఆ. వె. మ్రొక్కులిడుదు సర్వమునకు సర్వాత్మకు, శంకరునికి నతని కింకరులకు
నీదుపాదములకు నిత్యంబు మ్రొక్కెద, పాపభయవిభంగ భావలింగ!

గోచికన్న లేస గొప్ప పవిత్రంబు, నావుకన్న లేసి జగుగఁగలది
యొంగకంతచింత లెట్టివారలకును, పాపభయవిభంగ భావలింగ! 13

క. శ్రీరామచంద్రప్రముఖులును, వీరము గూడెంబు పాదపీఠతలోఁపన్
జేరక్కిన శ్రీగిరినివి, హారంబుగ వెలయు మల్లికార్జునలింగా! 61

క. ఘనవాంఛ నూరనేడ్వఁగ, దనఁదినుటకు నక్కలేడ్చు దావములోనన్
గననిది చోద్యము యంతట, ననుకొను సంగతకి మల్లికార్జునలింగా! 92

శిరపురపు జోగనార్యుని ప్రేరణచే వేదవిజ్ఞానము, శివజ్ఞానము నొంది విరాగియయ్యెను. ఉద్భటారాధ్య వంశ్యుఁడగు భోగలింగార్యుని కనిష్ఠపుత్రుఁడు.

---

# నూతులపాటి సుబ్బకవి

ఈతఁడు భద్రాద్రిరామచంద్రశతకమును దేవిశెట్టిగోత్రజుఁడగు దోసపాటి సర్వయపౌత్రుఁడును, వేంకటాచలము పుత్రుఁడును, అగు కోటయ్యప్రోత్సాహమున వ్రాసెను. ఆధునికుఁడు.

## భద్రాద్రిరామశతకము

సీ. చంద్రమండలముతో సావచ్చు, నీఫాలభాగంబు నవ్యతుల్పరిఢవింప
చిత్రతనకా శతపత్రంబులను గేరు, సొగసైన నీ నేత్రయుగళమరయ
శ్రీకారములసౌరు చీకాకుఁగావించు, విలసితమైన నీవీనులహాహ
చక్కటద్దంబుల చక్కనహసియించు, పొలలున నీకక్షుముల బెడంగు
ఇట్టి సంపూర్ణసుందరం బినుమ డింప, నగని నూనులు మోహించు టబ్బుగంబె
యమలగుణసాంద్ర! సూర్యవంశాబ్ధిచంద్ర, రాజరాజేంద్ర! భద్రాద్రిరామచంద్ర! 33

సీ. ఇక్ష్వాకురాజవంశ క్షీరవార్ధికి, సాంద్ర శరత్కాల చంద్రుఁడనఁగ
సరవినికోసలక్ష్మానాథు సుకగర్వ, రమణీయ పేటికి రత్నమనఁగ
ప్రముదాత్ముఁడౌ దశరథుమహారాజునే, త్రంబులకును పెన్నిధానమనఁగ
సంతతాశ్రితజన సమితిపాలిటికెన్న, పాలుపొందమందార భూజమనఁగ

జనన మొందితివౌ గదా సకలసురలు, సంస్తుతులొనర్ప లోకప్రశస్తముగను
యమలగుణసాంద్ర! సూర్యవంశాబ్ధిచంద్ర, రాజరాజేంద్ర! భద్రాద్రిరామచంద్ర!॥౫

# చెలికాని చెల్లయ్యమ్మ

ఈమె పద్మనాయకవంశజుఁ డగుచెలికాని వెంకయార్యుని ధర్మపత్ని. అనవరత భగవద్భాగవత భక్తియుక్తురాలు. వీరిది కుప్పనూళ్లగోత్రము. రావు భావయ్య చిన్నమ్మగార్లపుత్రిక. "పురాతన వేళంగిపురనివాసి నిదానీంతన కరపపురవాసి" తనబంధుగులకు, సర్వలోకమునకు శ్రేయముకలుగుట కీరెండుగ్రంథములను వ్రాసెను. (1) పార్థసారథిపద్యములు (2) జానకీపద్యములు నీమెకృతులు. నూజేసిపద్యములు కొన్నికీర్తనలునుగూడ వ్రాసెను. మంచి ధార కలదు. యతిప్రాసలు పాటింపలేదు. వానియంతట నవికొన్ని పడినవి. భాషలోఁ జాలవాడుక రూపము లున్నవి. శైలికిఁ గొన్నిపద్యములఁ జూపెదను. క్రీ॥శ॥ 1900 ప్రాంతమున నీమె యివివ్రాసెను.

## (1) పార్థసారథి పద్యములు.

సీ. కూర్మావతారమై కుదురునుండగ నెవడు, జలధిమర్దించిన జట్టియెవడు
అమృతభాండంబెల్ల సురలకిచ్చినదెవడు, అసురులహతముగావించె నెవడు
కాలకూటవిషంబు ఘనముచేసెనెవండు, శివునికంఠంబున నుంచె నెవడు
శృంగారమైన శ్రీ మోహినీరూపమున, అసురులను మోహింపఁజేసె నెవడు
గీ. ఇన్ని మాయలతోడ నీభువినినేలు, అనుదినంబును నానోటనుండు నెవడు
సాధురక్షణ సత్వాధికుడు యెవడొ, పార్థసారథి నీపాద శరణు శరణు.

## (2) జానకీపద్యములు.

సీ. ఇంపుతో నిజరూపు జూపిరక్షింతువు, నిను నమ్మియుంటిని నీరజాక్షి
గానలోలునితోడ కరుణజూపుమటంచు, నానుడువు గానీవు నెరపవమ్మ
తిరుమంత్రమును చెప్పి తెరవుచూపెడుతల్లి, జ్ఞానంబుబోధించు లోకమాత
పాపపంకిలమందు బడియుంటినని దెల్పు, కల్లసంసారమున నుంటిననుచు

గీ. ఏమి సేయుదునమ్మ యేరాజానినమ్మ, నన్ను రక్షింపకున్న నాకెద్ది తెరవు
నిన్ను వేడుచునున్న నన్నేలకొమ్మ. జన్మమిఁకనొల్ల నన్నేలు జానికమ్మ.

---

# దేవాదుల పెద్దన్న

---

ఇతఁడు శివభక్తుఁడు. విశ్వకర్మకులోద్భవుఁడు. ఉత్సాహవృత్తములలో "ఉమామహేశ్వరశతకము" వ్రాసెను. వివరములు తెలియవు. శైలికిఁ గొన్నిపద్యములు.

### ఉమామహేశ్వరశతకము.

ఉత్సాహవృత్తము

ఇట్టి పెన్నతేరు బుద్ధి సార్థిఁనందు బూన్చినన్
తురంగ మింద్రియంబులందు దుష్టవిద్య చక్రముల్
తెలుఁగు దప్పకుండ నస్మదీయ చిత్తవీథినిన్
స్థిరంబుగాను నిల్పి గావు శ్రీయుమామహేశ్వరా॥
ధరిత్రియందుఁబుట్టి నిన్నుఁదల్చనట్టివాఁడు వా
నరుండు యోగ్యజన్మమెల్ల నాగభూష నిన్ను సం
స్మరింతు సంతతంబు పూజసల్పి ముక్తులైరి న
న్నరుంది ప్రేమ జూపుగావుమా యుమామహేశ్వరా॥

---

# సన్నిధిరాజు జగ్గకవి.

---

ఈకవి రాజలింగశతకము వ్రాసెను. పిఠాపురము ప్రాంతము నందలి యుప్పాడనివాసి. క్రీ. శ. 1810 ప్రాంతములవాఁడు. ఈతఁడు సంగీతసాహిత్యవేదాంతముల నెఱిఁగినవాఁడట! ఈతఁడే జీవయెఱుకల కురవంజియను యక్షగానము వ్రాసెను. ఈశతకము విరహిణీశతకములజాతిలోనిది. పార్వతివిరహము వర్ణితము. వాకతిప్పరాజశేఖరు

నకటకీతము. శైలికిఁ గొన్నిపద్యములఁ జూపెదను. కవి యజుశ్శాఖీ, కాశ్యపగోత్రుఁడు. అమ్మయ పేరమాంబల పుత్రుఁడు.

శ్రీ రాజలింగశతకము.

సీ. కొమ్మరా బంగారుబొమ్మరా ముద్దుల, గుమ్మరా మనవి గైకొమ్మటంచు
కాంతిరా పుణ్యనితాంతరా సద్గుణ, శాంతరా మహిమ లనంతమనుచు
కల్కిరా కపురంపుమొల్కరా మరునిచే, చిల్కరా నీదయజిల్కు మనుచు
వెలఁదిరా సద్బుద్ధిగలదిరా యిదినీకు, కొలఁదిరా కోపము వలదటంచు
సతివరో వాని బ్రతిమాలి, హితవుపలికి, పతినిమరపెంచి నన్నొకసారి
గతినిఁజేర్చ వనిత! భవసాగరపుతెప్ప వాకతిప్ప, రాజలింగునిఁ దేగదె రాజవదన॥

సీ. నీయిల్లుగుడిగాను నీమేను శిలగాను, పరగ నీతలశశిఁబాముగరవ
నీగళంబున విషా న్వితఘోరమైయుండ, నీపుత్రుగర్భంబు నిల్వబగల
నీవాహనము ఘాసునిత్యంబుమేయను, నీడుసొమ్ములు శేష నియతిగాఁగ
నీహారసమితియు నెలమిపుట్టియుగాఁగ, నీజటపైకొమ్మనీరుగాఁగ
నీదుఫాలాక్షమున నగ్ని నిండుకొనను, యేలసతినేలుకోవని తూలనాడి
వనిత భవసాగరపుతెప్ప వాకతిప్ప, రాజలింగునిఁ దేగదె రాజవదన॥

# తూములూరి వేంకటరంగయ్య

## శ్రీ మీనాక్షీకల్యాణశతకము.

సీ. నాసికాగ్రమునంద నవమౌక్తికంబు మ, క్కఁదీను లవరంజి కమ్మలమరి
కరకంకణావళుల్ కంఠహారములు మ, ధ్యమున నొడ్డ్యాణంబు దనరఁగాను
అందియల్ మ్రోయంగ నతిరూపవతులైన, శ్రీభారతులజంట చేరవచ్చి
శోభనంబులు పాడుచునునవ్వు మోముపై, ముంగురుల్ గునిసి యాడంగనిలిచి
యెదుట ముత్యాలహారతుల్ యెత్తునపుడు, శంకరుండైనను సుందరేశ్వరునివద్ద
వేంకటేశుని చెల్లెలై వెలయుగౌరి, కరుణగలయమ్మ మీనమ్మ వరములిమ్మ॥

# అద్దంకి వేంకటాచార్యుఁడు

ఈకవి వ్రాసిననీరజాక్షశతకము, విరహిణీశతకము. గుంటూరుమండలము నందలి చీరాలదేవునిపైఁ జెప్పినట్లున్నది.

నీరజాక్షశతకము.

సీ. కమలాకళత్రుండు కాంచననేత్రుండు, నవనీతచోరుండు నగధరుండు
వేణువినోదుండు వేదాంతవేద్యుండు, తన్మాయతాక్షుండు పావనుండు
నీరదగాత్రుండు నిగమాంతగేహుండు. శరదిందువక్త్రుఁడు శాశ్వతుండు
వననిధిగంభీరుండు వసుదేవపుత్రుండు, మంజులభాషుండు మాధవుండు
మునిజనస్తోత్ర పాత్రుండు మురహరుండు, భక్తరక్షణదక్షుండు భవ్యయశుఁడు
నీరజాక్షుఁడు చీరాలనిలయుఁడైన, చిన్నికృష్ణుని తేరమ్మ చేడెలార! 80

సీ. పులుగుతత్తడి నెక్కి భువనముల్ రక్షించుఁ, బురుషరత్నము సుమ్మి పువ్వుఁబోఁడి
పాలమున్నీట లోపలపవ్వళించియు, లోకముల్ కాపాడు లోలనేత్రి
పన్నగరాజుపై పవళించి సుజనుల, పాలిటిదైవమే పద్మగంధి
కాయకూరలుదిని కానలఁదిరిగెడి, మునుల కాధారమే ముద్దుగుమ్మ
నమ్మియున్నట్టివారల నెమ్మనముఁ, బాయకుండియు కడతేర్చు భారకుండు
నీరజాక్షుఁడు చీరాల నిలయుఁడైన, చిన్నికృష్ణుని తేరమ్మ చేడెలార! 81

# మేడుకొండూరి కృష్ణదాసు

ఇతఁడు శ్రీహరిశతకమును రచించెను. కవి యెప్పటివాఁడో తెలియదు.

శ్రీహరిశతకము.

కోరితినయ్య నిన్ను మదికోరికలుప్పతిలంగఁ జేయుమీ
వారిజగర్భరుద్ర సురవందిత పాదసరోజ నన్ను మీ
కూరిమి పుత్రుఁగాఁ దలఁచి కోపముమానియు గొప్పఁజేయుమీ
భూరిదయాసముద్ర యిదె వేఁడెద మీశరణంబు శ్రీహరీ. 55

# పెద్ద కస్తూరి రంగకవి*

ఇతఁడు లక్షణచూడామణి యను రంగరాట్ఛందము, సాంబనిఘంటువు, కృష్ణార్జునసంవాద మను నైదాశ్వాసముల కావ్యమును రచియించెను. శ్రీవత్సగోత్రుఁడు. వేంకటకృష్ణార్యపుత్రుఁడు. ఆర్వేల కమ్మనియోగిబ్రాహ్మణుఁడు. తండ్రి కృష్ణార్యుఁడు. తల్లి కామాక్షమ్మ. ఇతఁడు తనలక్షణచూడామణి, ఫ్రెంచిగవర్నరగు డూప్లేదొర దుబాసి యగు "ఆనంద రంగపిళ్లై"కిఁ గృతియిచ్చెను. ప్రభుత్వమువారు ప్రకటించిన రంగపిళ్లై దినచర్య (Dairy) లో నీకవినికిభార్యకును గలతగవు పరిష్కరించిన ట్లొకటి రెండుచోట్ల నున్నట్లున్నది. క్రీ॥ శ॥ 1750 కిఁ బూర్వుఁడై యుండవలెను. పుదుచ్చేరిలో నుండియుండవలెను. ఇతనిసాంబనిఘంటువు 108 పద్యములు గలశతకరూపమున నున్నది. నైలికొకపద్యముఁ జూపెదను.

సాంబనిఘంటువు.

"సీ. సాంబశ్రీనామనిఘంటువనెడి కృతిని. ... ... ...

గీ. కవులదయచేత నీకటాక్షంబువలన నీసశతకంబుఁ జెప్పెదఁ జిత్తగింపు
దనుజసమవర్తి భక్తహృదబ్జవర్తి సకలసురచక్రవర్తి శ్రీసాంబమూర్తి॥

సీ. గురు వనవోజ్జను బరువునకుఁ జెలంగు, నారనాయప్లవ నాతికనయు
నూనెనబల్లెము నూరువునకుఁ బోల్చుఁ, దమియనరాత్రికిఁ దమికిసంబుగాఁ
గరియనదంతికిఁ గప్పనకుఁదనర్చుఁ జింతనాఁదింత్రిణి చింతయొనరు
మూలయనఁగఁగోణ మనకురిక్కకుఁజెల్లు, మడువనబ్రికుకును మనువుకునగుఁ

తే॥ గూటమనశిఖరిమునకు గుంపునకగు జాతియనఁ నన్వయమునకు జాతికనయుఁ
బురయనఁగ నెమ్మితోఁకకుఁ బురికిఁదనరు, సకలసురచక్రవర్తి శ్రీసాంబమూర్తి॥

నానార్థ పద్యము 95

నిఘంటువు 95 పద్యములలో ముగించెను.

---

* ఈకవి మొదలు (1) సత్యవోలుభగవత్కవి (2) రాచూరి లక్ష్మీరామదాసు (3) వెలిచేటి వెంకటరామప్రధానియు నీనల్వురును మూఁడవ భాగమునకు బోవలసినవారు. పొరబాటున నిక్కడ వేయవలసివచ్చినది.

# సత్యవోలు భగవత్కవి

"ఈతఁ డాఱువేలనియోగిబ్రాహ్మణుఁడు; జనార్దనామాత్యపుత్రుఁడు; భారద్వాజగోత్రుఁడు. ఈతఁడు గోదావరిమండలమునందించుమించుగా నూటయేఁబది సంవత్సరములక్రింద నుండువాఁడు. ఈతఁ డేనుఁగు లక్ష్మణకవి మొదలగువారితో సమకాలికుఁ డని చెప్పుదురు." అని కవులచరిత్రమనుచున్నది. ఇతఁడు రుక్మిణీపరిణయ మను ప్రబంధమును, నూఱుశతకములను వ్రాసెను.

క. ధీరతి శతశతకంబులుఁ, బారావళులున్ దశావతారావళులున్
జారూదాహరణంబులు, శ్రీరాజిత దండకములుఁ జెప్పినవాఁడన్॥

ఈతనిరుక్మిణీపరిణయము నందలిదశావతారపద్యములు తెలుఁగుదేశ మంతటను వ్యాపించి పలువురు భోజనసమయములయందుఁ జదువుచుందురు. ఈతనిశతకము లేమియు నాకుఁ జిక్కలేదు. దశావతారపద్యముల నొండు రెండుదాహరించెదను.

## కూర్మావతారము.

సీ. అమృతవారాశిఘటము మందరముఁ గవ్వ, ము ఫణిరజ్జువుఁ జేసిపూర్వదేవ
తలు దేవతలుఁబట్టి తరువఁగా ఘుమఘుమ, ధ్వనులు బ్రహ్మాండము దిల్లపడ
నపుడు "పరోపకారార్థమిదంశరీ, ర"మని కూర్మావతారమునఁ గ్రుంగి
న గిరిక్రిందనిలిచి "నాన్నోదకసమం, దాన"మనిసురల కమృతమిచ్చి
గీ. నిరుపమానలక్ష్మీరమణీమణీ మ, ణులుఁ గొలువ విలసిల్లితౌ నలఘుదాస
శీల! వైకుంఠనాథ! లక్ష్మీసనాథ!, రక్షణపరాయణానంద! నారాయణానంద!

## శ్రీ రామావతారము.

సీ. సూర్యవంశము పరిశుద్ధమని దశరథుఁ, డు సతులమనోరథుఁడని భరత
లక్ష్మణశత్రుఘ్నులకు సన్నవైపుట్టి, సౌందర్యచాతుర్య సామమాన్య
శౌర్యధైర్యౌదార్యవీర్య సత్యౌచిత్య, గాంభీర్య కర్తృమకర్తృమన్య
థాకర్తృ మతిసమగ్రత్వ సత్వాఘట, ఘటనాపటీయస్త్వ ఘనయశస్త్వ

సీ. సౌఖ్య సఖ్య దయాముఖ్యశాలివైన. రాముని సగానుని దగానాగ్రగాను నిను భ
జింతు వైకుంఠనాథ! లక్ష్మీసనాథ, రక్షణపరాయణుండ! నారాయణుండ!

ఈ పైపద్యములం జూచి కాశీచెనుల లక్ష్మణకవి యొకదశావతారస్తవము వ్రాసియుండెను. అందాతం డిట్లు నుడివెను.

"సీ. * * మనుదిట్టకవి ప్రకాశునిచే విరచితమై, యున్న పద్యంబులకన్న వన్నె
కలిగియున్నవి యివి కాశిచయనుల, లక్ష్మణకవియు నాడుకలను చెప్పి"

నట్లపై లక్ష్మణకవి వ్రాసెను. ఈపద్యములు దిట్టకవి ప్రకాశునివి కాకపోవుటయేగాక, వెఱ్ఱిభగవంతు డిలక్ష్మణకవితో నాతని పద్యములే బాగుగ నున్నవని రెండసత్యములు స్వప్నములోం బల్కుట వింతగం దోంపకమానదు. ఈలక్ష్మణకవి పద్యముల నిటం జూపెదను.

కూర్మావతారము.

సీ. క్షీరాబ్ధిం గలశగాం జేసి మందరగిరి, కవ్వంబుగా నందుం గ్రింద నొప్పి
వాసుకిం ద్రాడుగా వలనొప్పంగావించి, దేవదానవులు మథించు దద్భ
గంబునకోడి యాయంబుధిలో ధరగి, రిపహితంబుగాం గ్రుంగంజూచి
శంఖంబు ముఖముగాం జక్రంబు గప్పర, మగను శార్ఙ్గ పాదయుగముగా గ
గీ. దయు ఖడ్గ మవలిపాదద్వయముగం బూని, కూర్మంబవైయుండి గోత్రి మోచి
యమృతపానంబు చేంబూనియతివవైయ, సురలకొసంగి శోధించి సురల కిడిన
కృష్ణ వైకుంఠనాథ, లక్ష్మీసనాథ, రక్షణపరాయణుండ! నారాయణుండ!

---

# రాచూరి లక్ష్మీరామదాసు

---

ఈతండు కరణమో, మఱియొక యుద్యోగియో యైయుండవలెను. ఈస్టిండియాకంపెనీదినములలో జరిగిన కొన్ని పెద్దయుద్యోగుల విపరీతచర్యలకుం గినిసి రాజమహేంద్రవరమునందలి శ్యామలాంబను సంబోధించి తనశత్రువుల సంహారింపుమని ముఖాముఖిని దేవతతో మాటలాడుచు వ్రాసినశతకము. ఇందు వాడుకరూపములు,

కవికి దేవతస్వైఁ గలనమ్మకము విచిత్రముగనుండును. చింతలపూడి కృష్ణారావు కవికిఁ బ్రీతిపక్షి. కాంగ్రెసు ఉద్యోగుల రాజాజీ యధికారి. కవికిఁ బోయిన గూడూరియుద్యోగమును దిరిగి యిప్పింపుమని దేవతను బ్రార్థించును. ఆకాలమునందలి కలిదిండివారిదోపుళ్లు మొదలగు దేశవిశేషములు తెలియుచున్నవి. ఉద్యోగులకష్టములు కన్నులకుఁ గట్టినట్లుండును. ఇంతకంటె వివరములు తెలియవు. నైలికిఁ గొన్నిపద్యములఁ జూపెదను.

## శ్యామలాంబాశతకము.

సీ. ఈపురంబునకిల నీఁపుతోనీవును, జేసినపనులెల్లఁ జెప్పనేర్తు
కలిదిండివారును ఘనతగాబలిమితో, దోఁచినవారినిఁ దోలినావు
కొవ్వూరికాడను క్రొవ్వుమరాటీలు, దోఁచగావచ్చిన దునిమినావు
పండానుడును మఱి ప్రజలనుదండిగ, కోసవలె నన్నును కొట్టినావు
ఇట్టిధావశత్రుల యింకనుదునుము. శక్తిగా నినునమ్మితి కరుణయుంచు
పుడిమిలో రాజమహేంద్రపురనివాసి శాశ్వతంబైన వరమిమ్మ శ్యామలాంబ॥ 1

సీ. బందారులోపల బాగుగనయఁజేసి, ధొరలచే సన్నగల్ దొడ్డగాను
వ్రాయించితివి నీవు వరుసపైలోచేత, కోటిధొరలచేత గొప్పగాను
రాచూరితలలగు రామదాసునిపేర, తాకీదువ్రాయించి త్వరితముగను
మఱియు చింతలపూడి మఱి కృష్ణరాయుకయి, జాబువ్రాయించిచ్చి సాసనముగను
మొగలితుర్తిలో మాకును ముదముతోను, రునుమునిప్పింప నన్నదు మూర్ఖవాని
పుడమిలో............................॥ 22

సీ. ఈకుంపిణీవారు యీరాజ్యమందునఁ. దగువుబుదీర్చుచు ధర్మముగను
సన్నదువ్రాసిచ్చి సత్యంబుగానొరల్న, డుచుకొమ్మన్నను వరుసయిప్పుడు
మరుమాటలాడుచు మహీనివుండిరి యిపుడు నీయాజ్ఞచేయవే నిపుడు వారిఁ
గుంపిణీవారికి కుపలయచక్రంబు, నేలించవేయిపుడు వేడ్కతోడ
సన్నదును మాకు నిప్పించి జననినీదు, ఆజ్ఞచెల్లించి నడిపించు మంబనీవు
పుడమిలో............................॥ 27

సీ. నీవాకిటనుయున్న నిజముగాగొల్లను, దృశ్యంబుగాదది దృఢము మాకు
రాజాజిగారికి రాజ్యమహాలక్ష్మి, యెదుటనిల్చియునీవు యెడుక చేయి





ప్రభువు గోరు[illegible]గాఁ జెల్లును. జగపతిరాజును సాంగమున్న

శ్రీభక్తులకు నెల్ల నిజము[illegible]ఁ జెల్లును. నమ్మిత్రతినేతును నాతనిన్ను

ఇంద్రుడు చెల్లిన [illegible]కను నీవె, వీరికిని నీవు చెల్పిన విహితమున్న

[illegible]...................|| 38

---

# వెలిచేటి వేంకటరామప్రధాని

---

ఇతఁడు ప్రాచీనకవి. "పంచదబ్బులు" అని పిలువఁబడుచున్నాము లలో నొకటగు కృష్ణార్జునసంవాదము వ్రాసినవాఁడు. తనకృష్ణార్జున సంవాదమునం దీతఁ డిరువదియైదు శతకములును, విజయలక్ష్మీ నృసింహవిలాసము, వియన్నదీపరిణయము, బాణాసురయుద్ధనాటకము మొదలగు కృతులు వ్రాసితినని చెప్పెను.

సీ. మృదువుగా విజయలక్ష్మీ నృసింహవిలాస, మంచితగతిని రచించినాఁడు
పరగ వియన్నదీపరిణయం బను కావ్య, మొప్పుగా విలసిల్లఁ జెప్పినాఁడు
వినయంబుతోఁ బంచవింశతిశతకముల్, విరచించి హరికిఁ బంచినాఁడు
భాసురమతిని బాణాసురయుద్ధాది, వెసనాటకములు గావించినాఁడు

గీ. సరసుఁడవు నీవె రచియించు సవ్యసాచి, కృష్ణసంవాదమను సుధకోత్కృష్టకావ్య
మొనరమా పేరఁ గృతియిచ్చి ఘనతమీఱ, విస్తరింపుము లోక ప్రశస్తిగాను.

ఈకృష్ణార్జునవిజయము భక్తిప్రతిపాదకమైనది. ఇందు గయోపాఖ్యానమే కథ. ఇతఁడు జగ్గయమంత్రి పుత్రుఁడు మల్లికార్జునదేవునకుఁ గృతియిచ్చెను. మూఁడాశ్వాసముల గ్రంథము. ఈతనిశతకము లేమియుఁ జిక్కనందున వెలికిఁ బద్యము లీయఁజాలకపోయితిని. కవి క్రీ॥ శ॥ 1850 ప్రాంతమువాఁడై యుండవచ్చును.

---

# డబ్బీరు నరసకవి

ఇతఁడు కలువాయిశతకము (శృంగారశతకము) రచించి యున్నాఁడు. కలువాయిగ్రామము నందలికృష్ణుని సంబోధించుచున్నట్లున్నది. "చెలియ నీవేగి కలువాయి చిన్నికృష్ణు, తోడుకొని వేగ రాఁగదే తోయజాక్షి" అని సీసపద్యములు 100 వ్రాసియున్నాఁడు. విరహిణి యగుస్త్రీ తనచెలికత్తెను కృష్ణునిఁదెమ్మని తనవిరహబాధ నంతయు వర్ణించి చెప్పెను. కొన్నిపద్యములు రాధికాసాంత్వనాదుల యందువలె చాలశృంగార భూయిష్టములై యున్నవి. గుహ్యాంగవర్ణనాదు లెక్కువ. ఇది బాలురు, బాలికలు చదువఁదగినదికాదు. డబ్బీరువారు సృష్టికరణములు విశాఖపట్టణములలో నున్నారు. శైలికి రెండు పద్యములు:—

తిలకంబు నీటుగాదిద్ది మోమటుచూచి, బలుదర్పణము(గ్రిప్పి పాఱవైచు
గురులకొప్పమరించి కురులగానటుచూచి, విడినీలములఁద్రిప్పి విసరివైచు
కించుకంబమరించి కడు వేడ్కనటుచూచి, పూలబంతులఁద్రిప్పి పుడమివైచు
సొమ్ము శృంగారించి సుందరంబటుచూచి, తెప్పునరత్నముల్ ద్రిప్పివైచు
నిన్నివిధముల నన్ను మోహించియేలు, మచ్చికల నెట్లు మదిలోన మఱచినాఁడొ
చెలియనీవేగి కలువాయి చిన్నికృష్ణు, తోడికొనివేగరాఁగదే తోయజాక్షి.

కడునేదసను పెద్దకత్తిగుఁగలదుగా, నాపలు నీకమ్మలామోఁగదర
పెంచువానికినైన మించువిల్లుండఁగ, నయ్యయో తుంట విల్లామోఁగదర
కొలుగానివానికి గుజ్జంబాలుండంగ, నదవిచిల్కల నెక్కనామోఁగదర
యాకృతుల్ప్రాణాల కందరకుండంగ, నఁగహీనపుబ్రతుకామోఁగదర
చెడుగుబుద్ధులనట్టుల నెడితివంచు, నెన్నిచెప్పిన మత్సరంబెచ్చెనమ్మ
చెలియనీవేగి కలువాయి చిన్నికృష్ణు, తోడికొనివేగరాఁగదె తోయజాక్షి.

నెల్లూరుజిల్లా, ఆత్మకూరితాలూకాలో "కలువాయి" గ్రామ మున్నది. ఈకవి యచ్చటివాఁడేమో? కవికాల,కుల,నిర్ణయాదుల కా

ధారములుకన్పట్టవు. విశాఖపట్టణమండలమున డబ్బీరువారు సృష్టికరణములు కలరు. కొంద ఱితఁడావంశమునకుఁ జెందినవాఁడనిరి. సత్యమా తెలియదు. ఇది విరహిణిశతకములజాతిలోఁ జేరిన తాళ్ళపాకవారి రాజగోపాలశతకము, శ్రీశైలమల్లికార్జునశతకముల నంటిది. ఇందు దూతికపోయి నాయకునితో నాయకి పడుచున్నవిరహబాధ వర్ణించి నాయకునిఁ బ్రతిమాలి తీసికొనివచ్చును.

---

## రామాశెట్టి.

---

ఇతఁడు "బాలచక్రవేమశతకము" వ్రాసెను. ఇతఁడుకర్త కాక లేఖకుఁ డేమో యనియే యనుమానముగ నున్నది. ఈశతకము కదిరిలో వెలసిన మనప్రసిద్ధవేమనయోగిని గూర్చియే వ్రాసిన[illegible] కడచిన ఖరసంవత్సరమున వ్రాసినగ్రంథము. వేమనచరిత్రమను పెద్దగ్రంథములో నీశతకప్రసంగము వ్రాసితిని. ఇప్పుడీశతకమే దొరుకుట నాకు సంతస మొదవించినది. విషయములు చర్చితములు కావలెను.

బాలచక్రవేమ శతకము 32- C. 5 (ADYAR)

కదిరితూర్పుదిక్కు ఘనతశోభిల్లఁగా, పరగవరకటూరుపల్లి యనఁగ
అచటయునికిఁజేసి యమరియుండుదుదయా, బాలచక్రవేమ ధన్యనామ. 104

4 వ పుట 62 పద్యమునుండి 106 పద్యములుగలవు.

తల్లిదండ్రియన్నదమ్ములాత్మసఖులు, ఎలమిబంధువులాది యెల్లజనులు
గలిగివర్ధిల్లి రావూరు ఘనతమీర, బాలచక్రవేమ ధన్యనామ!

సంపూర్ణము.

---

శ్రీకృష్ణార్పణమస్తు. శ్రీ. శ్రీ. శ్రీ. జయము.

---